రమారమి నూటయిరువదియేండ్లక్రిందటనుండిన ములుగు మృత్యుంజయారాధ్య కవి తన గౌరీపరిణయ కావ్యము నం దిట్లు చెప్పియున్నాఁడు:

శా. శ్రీమద్గౌతమ గోత్రజుం
గురువరుల్ శిష్యప్రశిష్యాన్వితున్
కా...పాది...రు బుజ్జిగ మహా
భాష్యస్థితుని బండిత
స్వామిం వంశగురుండుగాఁ బడసె శై
వజ్ఞానసంసిద్ధచే
భూమిం బావనసాంప్రదాయి మగుచుర్
బాల్యాది విఖ్యాతితోన్.

—గౌ. ప.

కావున నిఁక వంశపరంపరాగతమైన స్మార్తాంశముగానఁ బ్రమాణముగాఁ గొనవచ్చును.

భీమేశ్వరమునొద్దనున్న కోటిపల్లి నివాసుఁడైన ఆరాధ్యదేవర యానాని గురువు. ఆరాధ్యదేవర గురువు అమరలింగయ్య. పండితయ్య ఆరాధ్యదేవరయొద్ద శైవదీక్షనొంది శైవమతరహస్యములఁ జక్కఁగాఁ దెలిసికొని, శైవాచారపరాయణుఁడై విలసిల్లుచుండ నచటిబ్రాహ్మణులువచ్చి యాతని శైవాచారములను నిందించిరి. అంత పండితుఁడు వారికి విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, గురుపాదోదకమహిమ, లింగార్చనమహిమ, ప్రసాదస్వీకారమహిమ, శ్రుతిస్మృతిపురాణోక్తి సహితముగ బోధించి, ఘంటాకర్ణాదిపురాతనభక్తచరిత్రములఁ జెప్పి వారిని మెప్పించెను. అటుపైని శివతత్త్వసారమను కృతి రచించి, దాని ననుసరించి నడచుచుండెను.

అంత పోరంగల్లు సూరసానమ్మయను భక్తురాలును, బెలిదేవి వేమనారాధ్యుఁడును మల్లికొండపఱు జంగములును బండితుఁ జూడవచ్చిరి. అప్పుడు పండితుఁడు శివపూజాసమయమున నున్నను జంగములు లింగరూపులు గాన వారినిఁ బూజించెను. వారు పండితునకు బసవేశుమహిమలఁ దెల్పిరి.

అంత సనదవోలు (చందవోలు) రాజగువెల నాఁటి చోడనిగురువు బౌద్ధపదాచార్యుఁడను బౌద్ధుఁడు, పండితుని శైవమతబోధ సహింపఁజాలక రాజును సభఁ జేయఁ బ్రోత్సహించి పండితు నటకు రప్పించెను. అంత పండితు లక్కడికు వచ్చిన సర్వమతములవారి మతములను ఖండించి శైవమతము నెలకొల్పెను. పండితుఁ డనేకప్రతిజ్ఞలఁ గావించి, 'రుద్రమహిమ' అనుకృతి నచట రచించెను. తరువాత బౌద్ధుఁడు పండితుని నిందించినందులకై యాతనిఁ బండితుని శిష్యు లిరువురు చంపిరి. రాజది తెలిసికొని పండితుని విచారింప నాతఁడు నేనే చేసితినని నేరమంతయుఁ దనమీఁద మోపుకొనెను. అంత రాజు పండితునికన్నులు తీయించెను. పండితుఁడు రాజునకు శాపమునెట్టి శిష్యసహితముగ ననురావతికిఁ బోయెను. చందవోలులో నున్నప్పుడు లింగోద్భవదేవుపై 'లింగోద్భవదేవగద్య' యను కావ్యమును బండితయ్య రచించెను.

అమరావతిఁ జేరఁగనే పండితుఁడు శివనిందవిన్న పాపమును, ద్రోహునితో సంభాషించినపాపమును పోవుటకు సహస్రగణనామములఁ బఠించెను. అంత పండితుని కన్నులు తిరిగివచ్చెను. అప్పుడనే 'అమరేశ్వరాష్టకముఁ' జెప్పెను.

పండితుఁ డమరావతిలో నుండగాఁ బసవేశ్వరుఁ డతనికి భస్మము పంపెను. అప్పుడనే యాతఁడు కర్ణాటకవిత్వముఁ జెప్ప మొదలిడెను. తరువాతఁ బండితుఁడు బసవేశ్వరునిఁ జూడవలయునని కల్యాణపురమునకు బయలుదేరెను. దారిలో నిడుముకలనుకోటఁ దనశిష్యుఁడైన దోసయ్యగారికి అన్నయైన . వీరచాకిరాజయ్యగారిచే గౌరవింపఁబడి హానుగంటికిఁ బోయెను. ఇచ్చట యుడయనుఁడను రాజు పాలించుచుండెను. పింగళి గోవింద ప్రధాని యాతనిమంత్రి. ఆతఁడు పండితభక్తుఁ డగుటచేఁ బండితుని గౌరవించెను. ఇచ్చట శివలెంకనామయ్య యను భక్తుఁడు, పండితసేవలో మైమఱచి రాజుసేవ సేయకుండెను. రాజుకోపమున నాతనిఁ బిలిపించి యడుగ 'దేహము మీదిగాని ఆత్మమీది కా' దని చెప్పి గుడిశిఖరముపై యురిపెట్టుకొనెను. పండితుఁ డారాజునకు శాపమిడి పయనము సాగించెను.

వనిపురమున శంకరయ్యయనుభక్తునిచేఁ బూజలఁ గొని కల్యాణకటమునకు బయలుదేరఁగానంతకుఁ బూర్వ

మెనిమిదిదినములక్రిందటనే బసవని లింగైక్యముఁ గాంద నట్లు తెలియఁ బండితుఁ డమితశోకము నంది మిక్కిలి ప్రలాపించెను. అంతఁ బండితుఁడు శ్రీశైలమునకుఁ బోవ దలఁచి వెల్లటూరియొద్దకు వచ్చి, తన ప్రియశిష్యుఁ డగు గోనయ్యను శ్రీగిరిప్రదక్షిణముఁ జేసి తన ప్రతినిధిగా నొందింపుమని చెప్పి యాతనికి 'పర్వతపాదనము'ను పిలిచెను. గోనయ్య గిరిప్రదక్షిణముఁ గావించి వచ్చినతోడనే పండితయ్య భార్యాపుత్రాదులతో వెల్లటూరిలో లింగైక్యముఁ గాంచెను.

పండితునికాలము శ్రీ లక్ష్మీరంజనముగారు నిర్ణయించిరి. ఆరాధ్యునితో సమకాలికులగు 1 వెలనాటి చోడుఁడు—(1163-1180), 2 కులోత్తుంగచోడుఁడు—(1162), (3) బిజ్జలుఁడు (1171), మొదలగువారికాలములఁ బట్టి ఆరాధ్యుఁడు 1120-1190 ప్రాంతముల నుండె వలెనని తేటపడుచున్నది.

ఆరాధ్యుఁడు వ్రాసిన పైగ్రంథములలో శివతత్త్వసార మొక్కటియే చిక్కుచున్నది. కన్నడభాషలోని తన 'గణసహస్రనామ' అనుకావ్యముగలదని కన్నడకవి చరిత్రమందున్నది. శివతత్త్వసారములో నేఁడు ప్రకటింపబడినదానిలో 489 కందపద్యములున్నయవి. ఇవియొక సహస్రముగా నుండియుండవలెనని కొందఱు పండితుల యభిప్రాయము. ఇదియే పండితారాధ్య చరిత్రమునకు మూలము. ఇందులోని విషయములును, సంక్షేపముగాఁ జెప్పఁబడినభక్తుల చరిత్రములును బండితారాధ్యచరిత్రములో విపులముగా వర్ణింపఁబడినవి. ఇందలికందపద్యములనే సోమనాథుఁడు ద్విపదలలో మార్పుచేయక వాడియున్నాఁడు. ఇందు మకుటనియమముగాని, సంఖ్యానియమముగాని లేకపోయినను, నాకాలమున నిది శతకముగా వ్యవహరింపఁబడుటచే నిది యాంధ్రశతక వాఙ్మయమునకుఁ బునాది యని చెప్పవలెను. మఱియు నన్నయ తిక్కనల నడిమికాలమునఁ బుట్టినగ్రంథములలో నొకటి యని స్పష్టముగఁ జెప్పఁదగినదియై, సలక్షణశైలిని వ్రాయఁబడి శతకరాజములలో నద్వితీయమై యలరారుచున్నది. ఇయ్యది బసవని లింగైక్యమునకు, నసఁగా, క్రీ. శ. 1167 తరువాత రచింపఁబడినది.

పండితుఁడు భగవదంశసంభూతుఁడు. 'శివభక్తి, నందిసర్వజ్ఞత, భృంగినిష్ఠ, మార్కండేయాదులశాపశక్తి, అక్షపాదాదుల యతులితవాగ్విలసత్త, ఉపమన్యుసద్గురుత్వంబు, రుద్రప్రమథగణాధిపుల సహజస్వకీయ ప్రసాదైకనిరతి, ప్రాక్తన పురాతనభక్తగణముల వ్యక్తసంస్పష్ట ప్రత్యయారూఢమహిమ, వీరభద్రుని శౌర్యము' నను నీ గుణము లొక్కమూర్తిగా నీశ్వరాజ్ఞవలన జన్మించినాఁడు. బసవన, జందెముతీసి వినుమనుచు లోఁ గలయు నుసఁగా 'భక్తిమీఁది నలపు బ్రాహ్మణ్యంబులోఁ బొత్తు బాయలేను నేను బసవలింగ' అని ప్రత్యుత్తర మిచ్చెనఁట. దీని వలన నితనిస్వమతాభిమానము, బ్రాహ్మణ్యాభిమానముఁ గూడ స్పష్టపడుచున్నవి.

ఈతఁడు నారనవంశ బ్రాహ్మణుఁ డైనట్లుచెంప కోలు శైవశిష్యులఁ గలిగియున్నారు.

కవులలోఁ గవియై, పండితులలోఁ బండితుఁడై అపారమహిమాన్వితుఁడై, యనేకభక్తులఁ బ్రోచి, యాంధ్రదేశమున శైవమతమును జిరస్థాయిగ నుండునట్లు చేసిన శ్రీమల్లికార్జున పండితారాధ్యుఁడు, సర్వాంధ్రదేశీయులకు పరమపూజ్యుఁడు. ప్రాతస్స్మరణీయుఁడు. ఆంధ్రదేశీయు లీతనిచరిత్రము శ్రద్ధతోఁ బఠింతురుగాత! సోమనాథుఁడు వ్రాసిన యాతనివర్ణనతో నీచరిత్ర ముగించెదను.

"ద్వి. శ్రీశైవసమయదేశికచక్రవర్తి
పాశవిమోచన పటుకళామూర్తి
శుంభద్గణంక విస్తృతసత్కీర్తి
శాంభవదీక్షాభి జాతానురక్తి
ఉత్తమోత్తముఁడు, సంయుతవీరభక్తి
వృత్తచిత్తుఁడు చతుర్వేదార్థవేత్త
గహనసంసృతి శిరఃఖండనహేతు
మహితపంచాక్షరమంత్రసిద్ధుండు
వేదాగమపురాణ విహితశాస్త్రోప
పాదితరుద్రాక్షభసితభూషణుఁడు
యమనియమాది వ్రతాచారసార



శ్రావస్తియొక్క సింహద్వారము






బుద్ధాలయము. (జేతవనము)

శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుండు,
అంతర్బహిర్ధ్యాన యజనవంతుం డ
వాంతరయ్యయనంగ హరగణాఢ్యుండు,
వాదివేష్యుండు దుర్వారసంసార
దూరసీరవ్రతోద్ధర వర్తనుండు,
శైవధర్మోత్తమాచార్యుండు సతత
శైవంబు సద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయవైశేషికోదాత్త శాస్త్రను
పాయదర్శన పరిపాలనపటిముఁడు,
స్వకులాంగనలోకనోత్సారితశిష్య
నికరసుమంత్రయానిరసితేంద్రియుఁడు,
తంత్రానిగమానేకతంత్రసుతంత్ర
మంత్రాగమతరాజమంత్రసిద్ధుండు
వేదవేదాంత వివిధపురాణ
పాదిత కేవలభక్తిసిద్ధుఁడు
పండితనుతపాదపద్ముండు, సుకవి
మండలీవిబుధ సమాజపూజితుఁడు
ఆరూఢిఁ గీర్తిసుఁడగు కోటిపల్లి
ఆరాధ్యుఁడనఁగ లోకారాధ్యమూర్తి
అసమానదీయలోకారాధ్యశిష్య
విసరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
తాను 'సరుద్రో నాత్ర సంశయో' యనఁగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
పశుయోగవాదాది పరవాది విసర
విశసన ప్రత్యక్ష వీరభద్రుండు
ఖండితాఘుఁడు, జగత్పావనకార
ణుండు విస్రుత జగన్నుతసితకీర్తి
అధికశాపానుగ్రహసమగ్రబలస
మన్వితు దన్యాసంచాతురీవేత్త
వాదదూరాసీకవాగ్బంధనక్రి
యావిశారదుఁడు, లోకారాధ్యమూర్తి
పరగ 'శైవే దశ ప్రత్యయా' యనగ
పరుపడఁ జను దశప్రత్యయాన్వితుఁడు
ధన్యుండు, దేశికోత్తముఁడు, లోకైక
మాన్యుండు, పండిత మల్లికార్జునుఁడు"

(పండితారాధ్యచరిత్రావతారి.)



# ప్రేమ

('స్కాట్' మహాశయుని పద్యఖండమున కనువాదము)

బాలాంత్రపు సత్యనారాయణరావు గారు

విమలమగుప్రేమము ప్రశాంతిసమయమం
గొల్లబోయని పిల్లనగ్రోవి నూఁదు [దు
రౌద్రభూయిష్ఠఘోరసంగ్రామ మందు
ధీరుఁడై పోరు యోధునితేజ మెక్క-
లచ్చి నృత్యంబుఁ గావించు రచ్చలందు,
కమ్రవసనాదిభూషలఁ గానవచ్చు
పామరజనంబు నివసించు పల్లెయందు
నవ్యశాద్వలభూముల నాట్యమాడు
ప్రేమయే శిబి రాస్థాన సీమ లేలు!
ప్రేమయే భువి మానవధామ మేలు!
ప్రేమయే దివి దేవతాధామ మేలు!
ప్రేమస్వర్గంబు, స్వర్గమే ప్రేమ మరయ!

నందజాలని భావప్రకటనము విశ్వాసార్హము (sincere) కాకపోవుటచే ఉత్తమకవితాలక్షణము కాజాలదు. ఒకయుగాద్యుననే రెండుపుటలదూరమైనను లేకుండగనే

రాజరాజేశ్వరులకు సలభ్యమైన
సదమలామూల్య తారకాసదృశదివ్య
మణివిరాజిత కల్యాణమకుటరాజ
మిడితి నామస్తకాన;

అనియు (పుట 75)

కంటకకిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందరంపు
గాలుపుకూటాల, నేకాంతగోష్ఠిసల్పి.

(పుట 71)

యుండుననియు వ్రాయ సాహసించిరి! పైన చెప్పినట్లు ఏదో యొక భావప్రాబల్యము లేకపోవుటే దీనికి కారణము.

దీనిని బట్టి చూచినచో నీకవికిగల స్వేచ్ఛాభిలాష యెంతవరకు నిజమని యాలోచింపవలసియున్నను. నేటి కవులందరును స్వాతంత్ర్యాభిలాషుల మని కంఠఘోషతో చాటుచున్నారే. కాని వీరు చేసిన సాహసకృత్యములేమి? చిరకాలములనుండి మనసంఘమునందు వేళ్లు నాటుకొని ప్రబలియున్న దురాచారములను, అసత్యభ్రమ సముదాయమును, ప్రతిఘటించి వీరులై నిల్చినవారు చాల అరుదుగా నున్నారు. బైరను షెల్లీలవలె తమ యభిప్రాయ ప్రకటనము కొరకు భౌతికసుఖములను, సర్వసంపదలను త్యజించి మాతృదేశముకొరకును మానవకోటికొరకును ప్రాణసమర్పణముచేసిన కవులును మనయందు ఒకరిద్దరి కంటె లేరు. మరి వీరిస్వాతంత్ర్య మెట్టిది? తెలియుట లేదు. తొంబదినూరు పుటలుగల యీగ్రంథమునందు వీరరసప్రధానమగు నట్టిది గాని, అణచివేయుటకునలనుగాని వీరుని యాత్మికకష్టపరంపరాభారమును ఓర్పుతోను, ధైర్యముతోను సహించి తనయందలి దివ్యగుణమును ప్రకటింప విజయముతో బయిటికివచ్చు సినమగు విషయముగాని లేదు. మరి యీస్వేచ్ఛాభిలాష యెట్టిది?

కవిత స్త్రీవంటిది. రెండును కోమలములు, పవిత్రవంతములు. స్త్రీకి సౌందర్యము భగవత్ప్రసాదితము. అతని దయవలనవచ్చిన యీసౌందర్య మలంకారాదుల వలన నెక్కువ చేయవచ్చును. ఈ రెండవది మానవునకు ప్రయత్నసాధ్యము. అటులే కవితకు భావము ముఖ్యము. అది తెచ్చుకొనుటకు కష్టమైనది. పవిత్రమగు జీవనము వలనను, తపస్సువలనను వీనిరంటిని మించి భగవంతుని దయవలనను సాధ్యమగునది. ఆభావమునకు మనోహర మగు రూపమునిచ్చునది భాష. ఇయ్యది సాధనచేసాధ్య మగునది. కొందరు తలచినటుల భావమునుబట్టి భాష వచ్చుననుట పొరపాటు. భాష సాధనచే సాధ్యమగును. మహాకవి తిక్కన భాషయందులేని మృదుత్వముతిమ్మన యొద్ద చేరినది. రామరాజభూషణుని భాషలో మోహన కరమగుధ్వనియున్నది. వారిభావములు మాత్రము సామాన్యములు. దివ్యత్వము జెందు స్వప్నసీమల దిరుగాడి యానందముతో వారు మాటాడలేదు. మాటలాడ లేక పోయిరి.

కృష్ణశాస్త్రి వ్రాసిన భాషయందు కొంచెము సాధన గోచరించుచున్నది. మన భావకవులలో చాల మంది రెంటికిని చెడిన రేవళ్లగుచున్నారు. చదువరుల మనస్సు రంజిల్లజేయగల భావములను వారికి భగవంతుడు ప్రసాదింపలేదు. కాని లోపల యుబలాటము లావుగ నుండ వారు మూర్ఖప్రణాళయమును ప్రవేశించవలసిన దురవస్థ ప్రాపించుచున్నది. అట్లని వారు భాషాసౌష్ఠవమైన జూపగలరా? లేదు. ఆ విషయమున దగు సాధన యుండదు. వారి చేతకానితనమునకును, సోమరితనమునకును మాత్రము మనము బాధపడుచున్నాము. శాస్త్రి యీ తెగకు జెందడు. ధ్వనిగల కవిత యితనిది. కాని యందు భావస్ఫురణము తక్కువ. రాయప్రోలు సుబ్బారావు వలె

ఎండిన బీళ్లయందు నుద
యించిన పచ్చిక కండ్ల పండువై
యుండగ జూడియాలు తల
లూపుచుబోయెడి; క్రొత్తనీటిచే
నిండె తటాకగర్భములు
నిష్కుటము ల్ఘనశ్యామలంబులై

మెండుకొన స్వర్ణ మొగిలు
మేసె ప్రభాతములందు కొండలఁ.

అనునట్లు 'మూడిపూలు' 'క్రొన్నురుగు మీగడతెప్పలు' మొదలగు పదముల ప్రయోగముచే చదువరియందు వివిధములగు భావముల నుదయింపజేసి యానందము పుట్టించు శక్తి యితనియందు దక్కు. కాని యితని పదముల పొందిక గంభీరమైనట్టిదై నిండి చదువరి నీచివరనుండి యాచివరకొక్కయూపున గొంపోవును. చూడుడు:

అమృతగాన
మధురమందాకినిభంగ మాలికాంబు
శీకరవితాన మోహన చిత్రనటన
మెన్ని యెన్ని రీతుల జూపుచున్నవాఁ?

* * * *

ప్రాజ్యపీఠపురీ మహారాజ్య భాగ్య
లక్ష్మి కొలువుదీర్చు చిరత్న రత్న ఖచిత
భాసమానకల్యాణ సింహాసనమ్ము;
అది వెలమ శౌర్యమూర్తి రణావనీవి
హారవిక్రమ కేళీకాననాంతరమ్ము
శాంతినుండు విలాసవిశ్రామ వేది;
అది సభాసీనసకలబుధావతంస
ఘనకవీశాన విజ్ఞాన కాంతి మత్స్ఫు
రన్న వీక్షణస్నాపిత స్వర్ణపీఠి;
అది మహీపతి రామరాయావనీంద్ర
కరకమలవీజ్యమాన చామరసమీర
పులకిత భవన్మృదుశరీరభూషితంబు.

(పుట 90)

వికృతక్రూరక్షుభిత మృత్యుకఠోర
వికటపాండురశుష్క వదనదంష్ట్రాగ్నిలో
నవ్వేలా?

(పుట 64)

కాని వీనియర్థ మేమి?

అవసరమైనపు డెక్కడికక్కడ విరిగిపోయి అర్థమును సులభగ్రాహ్యముగను హృదయమునకు దట్టునట్లును జేయగల చిన్నిమాటల నుపయోగించుటకూడ నితనియందుకలదు.

కరము కరమున గీలించి కలసిమెలసి
మన్న సహధర్మచారిణీ, మధురమధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణ
[రాగ
కలిత, నాదుఃఖ మసువులే తొలగిపోవ
వీడిపోవునేమోయను వెరపువలన
నాకు మరణమ్మువలదనినాను;—

పుట 91.

చూచితిరొ లేదొ చిన్నికృష్ణునిసొబగు(?)
పెదవి చివురుసంజల నరవిచ్చునవ్వు
వెన్నెల, చలించు తుమ్మెదబెళుకుచూపు,
లోలపవనచాలిత కుటిలాలకమ్ము.

పుట 30

ఈనడుమ సరళముగను మధురముగనున్న... ఇట్టిసారళ్యము నేమరిపోవుచు చితులయాసమొ కొన్నిచోట్ల లంగు లెక్కువరకపు శయ్యనువాడి రసభంగము చేయుట కూడ నీతనియందుగలదు.

ప్రావృడంభోధరస్వామి, జీవనంపు
భారము తొలంగిపోవ నెవ్వారికేని
కోరి నీసొదలను జెప్పికొందునేమొ [వేళ.
గొణుగుకొనుచుందువయ్య యొక్కొక్క

(పుట 65)

ఎదకరగునట్లు సన్ననియెలుగుతోడ
నట్టె తలయెత్తి పాటకూ కొట్టు చేద్దు
గాతమీవీచికాళి నగంబు నిదుర;

(పుట 96)

ఈ పైపంక్తులందుగల 'ప్రావృడంభోధరస్వామి', 'తలలెత్తి పాటపూకొట్టుచేద్దు' అనుపదములను 'ప్రాజ్యపీఠపురీ మహారాజ్య' అనుపదములతోఁ బోల్చినపుడు

'నక్కయోడ దివిజాధ్యక్షాలయంబేడ'

యను తిరుపతివేంకటకవుల వాక్యము స్మరణకు వచ్చును. సహజసుందరముగ పదగుమ్ఫన మీతని కెరుకనే. దాని నోపికతో సాధనచేసి రాణింపునట్లు చేయవలెను. ఛందోవిషయమున పూర్వకవుల యాచారానుసారముగ యతిప్రాసములను వాడుచుండెను.

సకల గోపాలగోపికాగణముతోడ

(పుట 28)

ఆయుగమ్యాతమస్సాంద్ర యవనికాంత
రంపు టేకాంతమునఁ బడి యూక్రమక్ర
మాస్తమిత నూపురారావాహ్వానములను

(పుట 93)

అను చోటులందు యతి చెడరినది. బుద్ధిపూర్వకమో? ప్రమాదమో!

అర్థము పూర్తియైనచో పాదపూరణముకొఱకు వ్యర్థపదములనువాడక ఆపాదము నచటనే సమాప్తముగావించి యితడు క్రొత్తమార్గము నవలంబించెను. కొన్నికొన్ని తావులందు సంగీతప్రధానముగ గీతములనువ్రాసెను. అవి బాగున్నవి.

చిన్నిపూవే వాడెనా
తన
కన్నెవలపుల వీడెనా
తన
చిన్నెలన్నియు వన్నెలన్నియు
మన్నులో గోల్పోయెనా?

(పుట 56)

కాని చెప్పినభావమునే మరల చెప్పుచుండుటచే నిండలి సొగసు చెడుచుండును. పైపద్యముక్రింద

కాంతు నెఱుగని కన్నెగాదా
సిగ్గువీడని మొగ్గగాదా
మొన్న మొన్న నె ముద్దువల్లిని
మొనలు దీరెనుగా!

యన్న దెందుకు?

ఇక జూడవలసిన దీతని ప్రేమవిషయము. ఇతని హృదయక్షేత్రమున ప్రేమోదయమైనది.

ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?
మావిగున్నకొమ్మను మధుమాసవేళ
బల్లవము మెక్కి కోయిల పాడుటేల?
పరుల దనియించుటకొ తనబాగుకొఱకొ?
గానమొనరింపక బ్రదుకుగడనబోకొ

(పుట 38)

అని యడుగుటవలన అది నిర్హేతుకమును అవ్యాజమునని తేలుచున్నది. అది యుత్తమమైనది. కాని

క్రౌర్యకౌటిల్య కలుషపంకంబువలన [య్యో
మలినమౌనా హృదయముధామ మెటు ల
నతివిశుద్ధము మధురము నఘరహితము
ప్రణయమునకంచు సందియపడుదువేమొ?
ప్రేయసీ! శర్వరీతమోవీథుల బడి
చందురుడు రాడె పూర్ణతేజస్వియగుచు;
అఘవిదూషిత మీహృదయంబునందె
ప్రేమకోమలతమము పవిత్రమయ్యె.

(పుట 40)

అని ప్రశ్నించుకొని సమాధానపడుటజూడ నీతని ప్రేమ విషయ మారంభమున కాఠిన్యముతో గూడినదా యను సందియము వొడమును. అదియునుగాక యీ ప్రేమకు నిధానము భగవంతుడా లేక స్త్రీయా యనుసంశయము కూడ కలుగుచున్నది. ఈ గ్రంథమునందలి కొన్ని ప్రేమ గీతములను భగవంతునిపరముగ నన్వయముచేయవచ్చును. కాని

ఇదెవచ్చుచున్నాను ప్రియురాలా
ఇకనిలువలేను నాప్రియురాలా!

(పుట 94)




రెండంకముల నాటిక.

విశ్వనాథ సత్యనారాయణ గారు

(నాంది)

నాసాంతే స్మృతసృష్టి దివ్యనహిమాభ్రూం న్యాసుసించర్యాం నే
నిష్ఠామద్గీత బాహ్యావష్టుని సగా సగా బ్రహ్మారంధ్రోన్నతాం,
తేజోభి స్ఫుత్రిత మైందవైః ప్రచలితై స్సూర్యార్ధ్యవిశ్వాత్మతే నాంసుధే
స్వర్గస్థిత్యంతహారిహేతు రసతాత్ శైవార్ధసీమంతినీ.

తేసకుం దేసకుఱ్ఱ మొలకతేరిన బత్తిని మత్పితృప్రతి
ష్ఠాపిత శైవలింగము గడుంగ భజించెద నాత్మ; వారణా
సీపురినేత భృంగిరిటశిష్యుని దగ్గనకుఱ్ఱ త్రిలోక ర
క్షాపతి నందమూరుపురసక్తు మదగ్రకణాళిహేతువుఱ్ఱ.

అమృతపదార్థముఱ్ఱ తెలిసినట్టిరు యోగులు తన్మనోంబుజ
భ్రమరము నున్మనీచరమభాగవిరాజిత బిందుశేఖర
స్థము పరతత్త్వమం చెఱుక చాలియు చాలక, చాలకే రఘూ
త్తమునిగ నెంతు మంత్రమహితాక్షరబద్ధసుమూర్తి నిత్యముఱ్ఱ.

శైవాంశం బని చెప్పనా! దశశిరస్సంత్రాసచండాకృతిఱ్ఱ
శ్రీవాయూద్భవు డందునా! అనిలు వంచించెఱ్ఱ మహాయోగినై
పోవా! కేసరికోతికూన యననా! ముక్తేంద్రియభ్రాంతు న
న్నావేశించిన రామచంద్రపదపద్మాధీనచేతస్కునిఱ్ఱ.

ఝణఝుంఝుణఝుంఝుణఝుణ
ఝుణాఝుణాఝుణమనోజ్ఞసంరావితకిం
కిణీపద సుమరద తాండవ
చణశారద మన్మనోఽచ్ఛజలధి మథించుఱ్ఱ.

# పూర్వాంకము

## రంగము. ౧

ప్రదేశము - వసంతోద్యానము

ప్రవేశము - సలీము

ఆకన్నదో యిలో స్వర్గజ్యోతిస్సులు వెలుగుచున్నవి.

ఏ మాసౌందర్యము!

ఈమావిగున్న యింత విరియబూయవలెనా!

నామనస్సేచిగురాకుమీదనే నిలుచుచున్నది.

[నిష్క్రమణం]

ప్రవేశము - అనార్కలి

నెమ్మదనెమ్మదిగవిచ్చు మల్లికాకుసుమము వలె మహాస్మహాన్నిష్కృత శోభాయమానముగి నున్నది!

శరత్పూర్ణిమా యామినివలె స్వచ్ఛముగానున్నది!

మక్కానగరగోపురముఁబోలిక స్వర్గశిఖరము తలపించుచున్నది!

అతని సౌందర్యమేమి!

[నిష్క్రమణ]

చిగురుకన్నె

మసృణ సంధ్యాకాల మధురకాంతులలోన
ఘుసృణమందార సంకుమదరోచులలోన
దాచుకున్నాను నాతరుణారుణచ్ఛాయ
వేచుకున్నాను నావిభునిరాకలదాక.

ముసలి సంజలతమ్మిమొగ్గమూతలలోన
కసటుప్రొద్దుటి లేతకలువవేపులలోన
నాకన్నెసిగ్గుటందము దాచుకున్నాను
నాకంఠమాల ప్రాణపతివచ్చెడుదాక

పసిలేడిచొక్కంపు పాలబుగ్గలలోన
నునులేని సెలయేటి నురుసునవ్వులలోన
పదిలించుకొంటి నాప్రాయంపుమిసిమెల్ల
మదనమోహనుడు నామధువురాకలదాక

రేపు వచ్చును సామి మాపు వచ్చును సామి
యీపూట తప్పదం చిన్నాళ్లు వేగగా
సౌందర్యమునకన్న సౌందర్యపుంగుప్ప
యిందు రానేవచ్చె నీమనోహరమూర్తి

రావమ్మ నవమల్లె రావమ్మ మాగధి
రావమ్మ మాధవి రావె శేఫాలికా
రావమ్మ పున్నాగ రావమ్మ మాకంద
రావమ్మ యిందీవరంబ ముద్దులగుమ్మ

రండు రండమ్మ పేరంటాండ్ర మీరెల్ల
పండ్లై మదనసుందరుడు రానే వచ్చె
న్యాసు సికొరకు పూజాద్రవ్యములు తెచ్చి
యేము కాచెదము రావే మోహనాకార.

వసంతుడు

ఇది యుషస్సతిమోము నదిమి కొన్నపరాగ
మిది సంజలేగటాం బొందుగుశోభారాశి
యిది పూవకన్నెలో పొదలు తేనెలవాక
యిది రసాంభోరాశి పదునుగొన్నకణంబు.

పుష్పకన్యకలు

ఇతడు మావిచిగుళ్ళు నెగచి వేసినజోదు
ఇతడె యందపుకోన లెల్ల మ్రుచ్చిలురాతు
సెలయేళ్ళయిసుకతిన్నెల నేలురా జితడె
ఇతడె ప్రాతఃకాల సతిమేన సితరోచి.

మాధవి

చేరిరారె ప్రదక్షిణముగా స్వామికి
మీరు కేల్కేలూని మేలికన్నియలార

మొన్నాళులకు వచ్చె నీదయౌవనరాశి
కన్నులవత్తులై కాగిపోతీఁగదమ్మ

మాగధి

పూవసంతాలమ్మ పూవసంతాలు
మావనాంతములందు మధులతాంతాలు
తల్లి క్రొంబొదుగువద్దకుఁ బోవు పసిలేడి
మెల్లగా చేయు స్వామికి నాడుకొనుటకు

శేఫాలిక

కస్తూరికొనిరండు కైవసంబయినాడు
శిస్తుపూయుదమ యీచిత్తేశు డీనాడు.

అందఱు

చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుకపొరలో
మొగలితావి పస బుగులుకొన్న పు
ప్పొడుల మేలితెరలో
కలసిగాడుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో
జిలుగుపూ లెసగుపచ్చనిబయలులఁ
గలసిపోద మా మనిలో.

పుష్పకన్యకలు

బాలమృణాలీలీలకరా-మ
త్తాళిమనోహరనీలకచా!-స
మ్మోదవనీపులకీకృతదేహా!
(నృత్యము)
చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుక పొరలో
కలసి పోవుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో.
(నృత్యము)

కవి

శ్రీఖండానిలగంధసంకలితమై
శేఫాలికామాధవీ
రేఖామంజులవాసనాలహరి ప
ర్వెన్ ప్రాతరానీతశో
భాఖద్యోత విలాసరాగలలిత
ప్రాంశుప్రభా చూతస
చ్ఛాఖాపల్లవరాజి కెంతయుఁ బరి
ష్వంగమ్ములై పొల్చెడిన్.

ఈమలయానిలయానంబులు వ
హించిన శైత్యము లెంతధూర్తముల్
లేమలతాపమ్ములఁ బద
లించుకొనెన్ వనములోన మందమం
దామలయానవైఖరుల
కబ్బిన పాంథవిలాసినీమనః
కోమలతాపదంబులును
కున్ నడివేసగి పల్లవంబులై.

ఊరక నాహ్లాదంతటము
నూచెదుఁగోరిక లేకరక్తపుం
నీరజపత్రకాంతులకు
నెయ్యములై తగుఫాల్గుణాంతవే
ళారుచిరంబులై యుదయ
లాలితసవ్యవనీవసంతశో
భారమణీయమైన నవ
పల్లవరక్తిమ యెంతక్రమమో.

రంగము. ౨

మిత్రుడు

ప్రభూ! ఏమి విచారించుచున్నారు.

సలీము

మిత్రమా! అనార్కాలి యనగా నేమి?

మిత్రుడు

దానిమ్మపూవు.

సలీము

అది గులాబికన్న మల్లెకన్న రమ్యమైనదా?

మిత్రుడు

ఏపూవున కాపూవే. ఏపూవురమ్యత దానిదే.

సలీము

గులాబి మల్లెలలో వాని సౌందర్యమునకు వానివాసన సహాయకారి యగుచున్నది.

మిత్రుడు

వాసన లేకున్నను గులాబి మనోహరమైనదే.

సలీము

దాని వాసనచేత నిదివరకే సమాకృష్టమైన నీ హృదయము దాని యందలి పక్షపాతమును వీడ జాలదు. జన్మతఃగల వాసనచేత గులాబిని మల్లెను మనము మిక్కిలి గౌరవించు చున్నాము. వానిని వాని వాసనకు గౌరవించు చున్నామేకాని వాని సౌందర్యమునకుగాదు. సౌందర్యముకూడ నున్నదా యుండనిమ్ము. వాసనా విరహితములైన ప్రసవములలోనున్న సౌందర్యము పక్షపాతముచేత మన మెప్పు కొనునది కాదు. అనర్కాళి చూడుము. దాని రక్తిమ,దానిసౌందర్యము! నా మనస్సు నంతకంతకు వశపఱచుకొన్నది.

మిత్రుడు

అవును ప్రభూ! తాము మునుపటివలె మావి తోటలకు బోయి క్రొత్త యంట్లు కట్టుటను గూర్చి విచారించుట లేదు. శిల్పులను పిలిచి వారితో శిల్పప్రసంగములు చేయుటలేదు.

సలీము

నా మనస్సు ననార్కాళి యాక్రమించుకొన్నది.

మిత్రుడు

సరే! ఇంక దానిమ్మ తోటలు వేయించి యందు గూడ నొక క్రొత్తవిధమైన ఫలములు గనుగొనుడు.

సలీము

(హాసము)

మిత్రుడు

ప్రభువు లన్యాయత్తచిత్తులై యున్నారు.

సలీము

ఆమె యన్యకాదు. అవివాహిత.

మిత్రుడు

ఆమె యెవరు?

సలీము

అనార్కాళీ.

మిత్రుడు

స్వర్గవాహిని చవిటి పఱ్ఱల మీద బ్రవహించు చున్నది.

సలీము

ప్రేమ వాహిని వంటిది. దానికి నిమ్నోన్నత త్వములు సమానము.

మిత్రుడు

(హాసము)

రంగము. 3

అనార్కాళి

అజీజ్! ఇప్పు డెంత ప్రొద్దు పోయినది?

అ జీ జ్

రెండు ఝాము లైంది.

అనార్కాళి

నాకు నిద్ర వచ్చుట లేదు.

అజీజ్

ఏంచేత?

అనార్కాళి

మనస్సున నేదియో యావేదనగా నున్నది.

అజీజ్

దీనికోమందుండ చెప్పనా?

అనార్కాళి

ఊం.

అజీజ్

భరతపక్షి వుందే. అది గుడ్లుపెట్టి మేతకెళ్ళి నపుడు నెమ్మదిగా చెట్టుమీద కెక్కి, అందులో ఒకగుడ్డుకీ చిన్నబెజ్జం చేసి, అందులో రసంఅంతా ఓడ్చేసి దాన్నిండా పాదరసం పోసి యేం యెరగనట్టుగా దిగిరావాలి. తల్లి వచ్చి తనగుడ్లు సరిగానే వున్నవని సంతోషిస్తుంది. మనం పాదరసం పోశామని తెలియదుగా! అది తనగుడ్లను పొదుగుతుందా! మన పాదరసం గుడ్డునుగూడా పొదుగుతుంది. మన పాదరసంగుడ్డు పిల్లనిపిట్టవుతుంది. ఆపిట్ట యీకలుతెచ్చి అవికాల్చి బూడిదచేసి తేనెలోకలిపి పొద్దునా సాయంత్రం ఒకమండలం రోజులు సేవిస్తే యెటువంటిరోగం నిమిషంలో కుదురుతుంది.

అనార్కాళి

ఈమందు నీకెవరు చెప్పినారు?

అజీజ్

సారాదుకాణంవాడు.

అనార్కాళి

మరల నక్కడకు వెళ్ళుచుంటివా? నేను వెళ్లవద్దని చెప్పితిని గదా!

అజీజ్

ఊరికే వెళుతున్నాను. తాగడం లేదు. కాని తాగితేనేం? ఎంతో వుత్సాహంగా వుంటుందే.

అనార్కాళి

లోపల నరములును మాంసమును చెడిపోయి మృత్యువు శీఘ్రముగా తటస్థించును.

అజీజ్

ఇంతేగదా?

అనార్కాళి

ఏమట్లంటివి?

అజీజ్

చచ్చిపోతే బతికించడానికి నాదగ్గిర మందుందిగా.

అనార్కాళి

అదేమిటి?

అజీజ్

జెముడు కాకి వుందా, అది మేతకెళ్ళినప్పుడు దాని గూడెత్తుకొచ్చి గంగలో పారేస్తే అందులో సంజీవిపుల్లని ఒకటుంటుంది. అది ప్రవాహాని కెదురీదుతుంటుంది. అది తీసుకువచ్చి చచ్చిపోయినవాళ్లకి ముట్టిస్తే అందరూ లేచి కూర్చుంటారు!

అనార్కాళి

నీకు చదువు చెప్పెదను. నేర్చుకొందువా?

అజీజ్

నాకు చదువుకోవాల్నేవుంది.

రంగము. ౮

రు సీ

అనార్కాలీ! నీవు చాల యందెకత్తెవు.

అ నా ర్కా ళి

రుసీ! నీవు చాల తీయని దానవు.

రు సీ

నీ యంత ప్రశస్తమైనదానను కాదుగా!

అ నా ర్కా ళి

అనార్కాలి యనఁగా అనార్కాలీది. రుసీకిని దు సినది. ఇది పూవు. అది కాయ.

రుసీ

పూవ్వను కాయ కాచి పండు గాక యెప్పుడును పూవుగానే యుండునా?

అనార్కాళి

పూవు పూవు గానే మాడి పోవచ్చును.

అక్బర్

మాడి పోయినా పువ్వు పువ్వే. దాని వాసన నాలుగు దిక్కులూ గుబాలాడి పోతై.

రంగము ౯

అనార్కాళి

మిత్రమా! మరల వచ్చితివి.

రుసీ

ఉస్తాదు మరల పంపించినారు.

అనార్కాళి

అయ్యో నాకేమియు నోపికగా లేదు.

రుసీ

పాఠశాల చూచుటకు వచ్చునది యువరాజు సలీము గారట.

అ నా ర్కా ళి

(హాసము)

రు సీ

ఏ మందువు?

అ నా ర్కా ళి

నీ యిష్టము.

రు సీ

తప్పక రమ్మని.

అ నా ర్కా ళి

అంత వరకు వచ్చినను నృత్యము చేయలేనేమో!

రు సీ

నీవు వచ్చిన చాలునన్నారు ఉస్తాదుగారు.

అనార్కాళి

సామ్రాజ్ఞి బలవత్తరముగా నున్నది.

(కొంచె మోహము)

రుసీ

స్నానమైనదా?

అ నా ర్కా ళి

ఆ.

రుసీ

దుస్తులను వైచుకొని కన్నులకు కాటుక దిద్దుము. ఇదుగో నృత్యశాల.

అనార్కాళి

ఓపిక లేని నేను నృత్యము చేయుచున్నప్పుడు కాలుజారి పడెదనేమో!

రుసీ

భయము లేదు.

అనార్కాళి

నా హృదయము కొట్టుకొనుచున్నది.

రనీ

భయము లేదు.

అనార్కాళి

నా కంఠము నణకి పోవునేమొ!

రనీ

మాటలాడకుండ గూర్చుండుము. ఇంతలో కబురు వచ్చును.

ఉస్తాదు

జహాపనాహ్! క్షమించుము.

సలీము

చెలికాడా! ఫర్మానా చూపించుము.

(ఫర్మానాకళ్లకద్దుకుని) ఉస్తాదు

జహాపనాహ్! బిడ్డకు జ్వరముగా నున్నది. తమ యాజ్ఞాబలమే యామెను రక్షించినది. తప్పులు క్షమించవలయును.

మిత్రుడు

ఫరవాలేదు. కానిండు.

ఉస్తాదు

బిడ్డా, అనార్కాళీ!

అనర్కాళి

నీ పదమ్ముల యంద నిలచి యున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!
ఈ మహాఝురి యందు నీదు లాడగనైన
కాలు సేతులు రావు కరుణించవే నాథ!
హేనాథ! నీపాద మీ దాసి కన్నీట
కలుషితం బైనచో క్షమియింపవే నాథ!
ఈ తుమ్మి పువు కన్నె యెంత బేలయొ కాని
భృంగరాజును జూచి బెంగ కొన్నది చూడు.
హేనాథ! హేనాథ! హేదయావనరాశి
కలుషాత్మ యగు దీని గాచ్చివేయుమునాథ!

(మూర్ఛ)

ఉస్తాదు

రనీ! రనీ!

మిత్రుడు

అయ్యో!

ఉస్తాదు

ప్రభువుగూడ మూర్ఛ పోవుచున్నాడు. దయావనరాశి యీమహారాజు.

రంగము ౬

సలీము

నీ పదమ్ముల యంద నిలచియున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!

ప్రాణప్రియా! నాహృదయమును నీయందే నిలచియున్నది. మాతండ్రిచే కఠినముగా విధింపబడిన నాప్రవర్తనము నిన్ను నేనుదర్శించుటకుగూడ వీలులేకుండ జేయుచున్నది. అప్పటికిని నృత్యమును చూడవలెనను మిష చేత నిన్ను దర్శించుటకు వచ్చితిని. అపుడు నాదురదృష్టముచేత నీవు జ్వరార్తవైయుంటివి. అప్పటి నీజీర్ణశృంగారము నాకనుల కంట గట్టినట్లున్నది. మనోహారిణీ!

దేవీ! ఇదిగో! ఈప్రకృతి వికసించినది. నీహృదయము నాయెడల వికసించలేదేమి? నీవు నాయెడల నెట్టిభావములు గలదానవో తెలిసికొనకుండ నిన్ను దేవీయని సంబోధించుచుంటిని క్షమింపుము.

శ్వ స స్తి





జేతవన స్తూపము - 1.



జేతవనస్తూపము. 2.

నీ కీ బానిసవృత్తి లభింపజేసిన దైవ మెంత యనుల్లంఘనీయముగ నున్నది. నీవు బానిసవు గాకపోయిన దో నీవిషయము నాతండ్రితో జెప్ప మనయిద్దరము నాయన యనుమతిమీదనే వివాహము చేసికొనెడివారము. ఇప్పుడు వారి యనుమతి లేదుగాన మన సమాగమము దూర మగుచున్నది.

నిన్ను చిన్నతనములో తెచ్చి బానిసగా నమ్మినవాడెవ్వడు? నిన్నే యింట నుద్భవించ తివో తెలియదే! ఏ సత్కులమున బుట్టిన నే సౌందర్యగృహస్థు నింటనైన నీవు పుట్టినచో నా సామ్రాజ్యము నీకొరకే మహాలంకారము చేసి వాపోవుచున్నాను.

ఆహా! ఈ బానిసవృత్తి యెంత చెడ్డది! చక్రవర్తులుగూడ భోగలాలసులై యిట్టి పనిచేయుట యెంత దేశారిష్టదాయకము! ఈవృత్తికి రాజులు సానుకూలించుచున్నారు. చక్రవర్తులు ప్రోత్సహించుచున్నారు.

కానిమ్ము! బానిస మనుష్య కాకపోయిన దా? భగవంతుని యొక్క చిహ్నాలాని మామెలో లేకపోయినదా? ప్రేమయను నమృతపదార్థ మామెలో దొరకదా?

ప్రియా! నీకు దత్తమైన నాహృదయము మరల నేను లాగుకొనలేకున్నాను.

అనార్కలి బానిసకూతురు. నేను చక్రవర్తికుమారుడను. మాయిరువురి వివాహము రాష్ట్రమునకుగాని రాజునకుగాని యనుమతి యెట్లు? ఇట్టి సంబంధము గలిపించుకొని నా తండ్రికిని రాష్ట్రప్రజలకును నిష్టములేని పని యేల చేయవలయును? మానుకొందునా?

పుష్పకన్యకలు

ప్రాతర్వికసిత పంకజనిర్గత
బాధుర రమణీయామోదంబులు
నీలో దాగెనులే

వసంతుడు

ప్రాలేయాంచిత పాథోబిందులు
మీలో దాగెనులే.

పుష్పకన్యకలు

బాలమ్ముగాలీ లీలకరా-మ
లాలీ మనోహర నీలకచా-న
మ్మోదవసి పులకీకృతదేహా
(నృత్యము)

పుష్పకన్యకలు

కైవండలుగొని కమలపరాగము
లాడట విసరెడు సరసులలో
పోదము మలయసమీరము సారము
పొల్చుకొన్న దారులలో.

వసంతుడు

సిగ్గేటికి వాసంతిక రావే
చేబూనవె నా ప్రాణసఖి
ముగ్గులు పెట్టితిపరాగ సంతతి
పూలువిరియు నీవనిలో.

అందరు

చిలుప వానలకు చిగురులు పెట్టిన
సెలల యిసుకపొరలలో.
కలసిపోవుదము పాటలు పాడుచు
మలగిపోవుదము వీనిలో.

సలీము

ఆహా! ఏమా సౌందర్యము! తలంచు కొనిన కొలది నాయీ యూహాలువమ్మై పోవునట్లు

తెలిసినది. ఇరువురును బానిసలే. బానిస నని చక్రవర్తికి తెలియదు. బానిసనని బానిసకు తెలియును.

ఇంతగా సంస్కారము కలిగినను నా మనస్సునకు శంకారహితత్వము గలుగలేదు. ఉన్న యీ చక్రవర్తిత్వము తప్పుట యెట్లు? మనస్సు సమాధానపఱచుకొన్న యీ సమానత్వ మాచరణకు దెచ్చుకొనుట యెట్లు?

కవి

భ్రూపుటంబున దృష్టి నిల్పుకొని యోగి
ప్రకృతి బహిరంతరంబుల పరిధివిల్లు
నాత్మతత్వంబు చూచి మహాప్రపంచ
మందగా రాని యానంద మనుభవించె.

ప్రకృతి భేదమ్ము పై కట్టబడిన నాట
తెర మహాస్థగినిని తన్ను గాను చూచి
నవ్వుకొని మునిగిపోయె నానంద వార్ధి
సర్వవస్తు సమత్వంబు సంభవిల్లె.

మధుర మధుమాస మరుదెంచి మధుకరీవి
లాసరాగంబు లాశావికాసమయ్యె
సృష్టి యెచ్చట బఱపిన నింతయనుచు
చెప్పగా రాని యానంద సిద్ధి కలిగె.

సలీము

మధుమాస వశమున పులకితమైన యీ ప్రపంచ మింత యానందదాయకముగా నుండి నాలో నున్న యీ శంకామాలిన్యమును క్షాళితము జేసినది. ఇంతవఱకు సందేహవార్ధిలో నేనేల మహావాయుఘాత నౌకవలె నల్లలాడుచుంటిని? దేవి! అనార్కలీ! నీవే నా మనస్సునకు కథనేత్రి వైతివి. భావిభారత చక్రవర్తిని నేనే. కాదా, నీకొఱకు నేను బానిస నయ్యెదను. నీవు లేని నాకీ రాజ్యమెందులకు? భోగము లెందులకు? దేవి! సర్వము నర్పించితిని. నాజన్మలో ప్రప్రథమమున నాదృష్టి నీ రూపునే తగిలినది. నీవు మహారాజపుత్రివి కానిమ్ము, బానిసవు కానిమ్ము! నాజీవితాంతమ్మును నీవే యధినాయకురాలవు. దేవీ! కటాక్షింపుము. ప్రసన్నా! అనుగ్రహింపుము!

# కోరిక

పెనుమర్తి వెంకటరత్నము గారు [యువకవిమండలి]

దేవుండు

ఏమి కావలె నరుడ కోరుము
　　నీ మహాతపములకు మెచ్చితి
భూమిలోపల నైంద్రభుక్తి
భోగమడిగెదరా ?

భక్తుఁడు

విసిగిపోయితి నైహికంబుల
ముసుఁగు వెట్టితి జ్ఞానదీపము
రక్తి లేదిఁక భోగములలో
ముక్తినిమ్ము గురూ!

యోగి

లోకమంతా మిథ్య కాదా!
శోకమొకటే ప్రాకిరాదా!
నాకొసఁగు సాయుజ్యపదవిని
నాయనుఁగు తండ్రీ!

కవి

తనివి తీరదు! యెంత పాడిన
తనివి తీర దికెంత ఆడిన
ప్రకృతిలోపల నిన్ను చూస్తూ
పాడుకొందు గురూ!




శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి
[హిందీభాషనుంచి అనువదించినది]

౧

సాయంకాలము వకీలు బజారునుంచి ఇంటికి రాగానే ఆయన భార్య మోహిని ఉత్సాహంతో చూచి "ఈవాళకూడా మరిచిపోలేదుకదా?" అన్నది.

వకీలు మందహాసము చేసినాడు. మోహిని వికాసముతో ఆయనచేతిలోనుంచి "లెవెండరు" సీసా అందుకొన్నది.

సరిగా ఆవేళకే ఆయనపరిచారికకొడుకు కేశవుడు అక్కడికి పరుగెత్తుకు వచ్చాడు. సంతానము లేని ఆదంపతులహృదయాలు ఏను ప్రేమతో నిండిఉన్నవి. కేశవుడు వారిప్రేమకు పాత్రుడు కావడానికి గుణముతో పని లేకపోయింది. బాలకులకు సహజమైన సారళ్యముతో కూడిన వానిచిరునవ్వు మోహిని చీరెకొంగునుంచి అనురాగమునూ ఆనందమునూ ఆకర్షించగలిగింది.

కేశవుడు వకీలు చెయ్యిపట్టుకొని "బాబుజీ, 'టోపీ తెచ్చారా?" అన్నాడు.

"తేలేదు కేశవా. ఈవేళకూడా మరిచిపోయాను" అన్నాడు వకీలు.

నిరాశవల్ల కేశవుని కళ్లనిండా నీళ్లు తిరిగినవి. మోహిని చూడలేకపోయింది. ఆమె కోపము తెచ్చుకొని "అయితే దీనికి శిక్ష యేమిటి?" అన్నది.

"సర్కారువారి చిత్తం!" అన్నాడు భర్త.

భర్తకొత్తటోపీ — క్రొత్తకంపెనీవారు తయారు చేసిన — దానికమూటనుంచి తీసి మోహిని కేశవునికి ఇస్తూ "తీసుకో కేశవా, ఇది తీసుకు పో" అన్నది.

కేశవుడు టోపీ తీసుకొని సంతోషముతో తల్లిదగ్గిరకు పరుగెత్తుకొనిపోయినాడు. మోహిని చూస్తూ ఉన్నది. భార్యవిశాలచనశీలతను ఆ రాత్రి ఆయన భక్తి విస్మయముగా స్వీకరించి నవ్వినాడు.

౨

"ఊఁ, నేను తప్పకుండా ఉత్సవానికి వెళ్తాను" అన్నాడు కేశవుడు.

"ఎవ రన్నారు? అంతా వృథాదే! ఈవాళ ఏమీఉత్సవంలేదు కేశవా!" అన్నది తల్లి.

కేశవుడు తల్లిచెయ్యి పట్టుకొని వసారాలోకి తీసుకుపోయి "చూడు, ఎంతమంది గుంపుగా వెళ్తున్నారో! ఇంకా ఉత్సవం లేదంటున్నావు!" అన్నాడు.

"కాని నిన్ను వెళ్ళనివ్వను" అని తల్లి బెదిరించింది.

కేశవుడు కళ్ళు నీళ్లుపెట్టుకుని "ఇవాళకు మాత్రం వెళ్ళనీ. ఇంక మళ్ళీ యెన్నటికీ వెళ్ళనమ్మా!" అన్నాడు.

తల్లి కేశవునితల నిమురుతూ "కేశా, చిన్నవాడవు. ఒంటరిగా జనసంఘంలోకి ఎలా వెళతావు? బళ్ళకింద పడిపోతావేమో నాయనా!" అన్నది ప్రేమతో.

ఏమీ తోచక పిల్లవాడు గుంపుకేసి చూస్తూ "ఎంతెంతమంది చిన్నపిల్లవాళ్ళు వెళుతున్నారో. నేనొక్కణ్ణే చిన్నవాడినా? కాస్త దూరం నడుస్తాను. నిజంగా, అమ్మా!" అన్నాడు.

ఎన్నివిధాల చెప్పినా కేశవుడు వినకపోవడము చేత చివరకు తల్లి "సరే, వెళ్ళు. అయితే సూర్యాస్తమానం కాకముందే ఇంటికి రాకపోతే ఏమిటో చూస్తాగా!" అన్నది.

కోరిక నెరవేరినట్లు బాలుని ముఖము శోభాయమానమయింది. వాడు ఉత్సాహంగా "తప్పకుండా వస్తా అమ్మా" అని పరుగెత్తబోయినాడు. తల్లి వానిచెయ్యిపట్టుకుని "ఈమురికిగుడ్డలతో వెళతావా? పద, మంచిచొక్కా తొడుక్కుందువుగాని" అన్నది.

కేశవుడు పెట్టెలోనుంచి కొత్తచొక్కా తీసుకుని తొడుక్కున్నాడు. "టోపీకూడా పెట్టుకో" అన్నది తల్లి.

కేశవుడు వెంటనే "అమ్మా! ఆరోజు బాబుగారిచ్చారే, ఆటోపా?" అన్నాడు. టోపీ శిరస్సుమీద ఉంచి "జాగ్రత్త, పారేసేవు!" అన్నది తల్లి.

క్రిస్టీటోపీ పెట్టుకుని కేశవుడు ఉత్సవము చూడడానికి బయలుదేరినాడు. సంతోషముతో తల్లి పిల్లవానికేసి చూచింది.

విదేశవస్త్రదహనం జరుగుతుందని కేశవుడికి త్రోవలో తెలిసింది. ఒకాయన విదేశవస్త్రాలు పోగు వేస్తున్నాడు. ఆయన కేశవునిదగ్గిరికి వచ్చి "తే, నీటోపీకూడా" అన్నాడు.

"ఎందుకూ?"

"కొంచెం సేపటిలో ఈవిదేశవస్త్రాలపోగు తగలబడిపోతుంది"

"అయితే, ఈటోపీకూడా తగలేస్తారా యేమిటి?"

"భారతవర్షపు ఉన్నతికోసం యజ్ఞం జరుగుతుంది. దాంట్లో విదేశవ్యాపారం ఆహుతి అవుతుంది."

బాలుడేమీ గ్రహించలేక "ఊహూఁ, నా టోపీ ఇవ్వను. టోపీ పోగొట్టుకోవద్దని మా అమ్మ చెప్పినది" అన్నాడు.

"చూడు. అందరూ తమబట్టలు ఇచ్చేశారు. నువ్వుకూడా తే" అని ఆయన బోధించాడు.

"నే నెలా ఇస్తాను? మాఅమ్మకు ఏం చెప్పను. అమ్మ నడిగివచ్చి యిస్తాను" అన్నాడు కేశవుడు.

ఆయన నవ్వి "సరే" అని వెళ్లిపోయినాడు.

తన ముద్దులటోపీని భద్రముగా చంకలో పెట్టుకొని కేశవుడు ఉత్సవము జరిగేచోటికి వెళ్లినాడు. అక్కడి విదేశవస్త్రాల రాశి ఆకాశము అంటుతున్నది. రకరకాల పట్టుబట్టలూ,

"మంచిపని జరిగింది కేశవా! దీనిగతి యింతే కావలి!"

"ఏమిటి! ఇదికూడా విదేశీదేనా!"

"అవును"

"అయితే సరిగ్గానే జరిగింది!"

తల్లి కేశవునిచెయ్యిపట్టుకుని "పద, నాయనా, అన్నం తిందువుగాని, ముఖమంతా వాడిపోయింది" అన్నది.

కేశవుడు చెయ్యి వదిలించుకొని "అమ్మా, ఉండు. ఈవిదేశీసీసా పగిలిపోయికూడా భారతీయులమీద కసితీర్చుకోవానికి కాళ్ళల్లో గుచ్చుకుంటుంది. పెంకులేరి మహాసముద్రంలో విసిరివేస్తాను" అన్నాడు.

పగిలిపోయిన సీసాపెంకులు ఏరివేసి కేశవుడు తల్లివెంట వెళ్ళాడు.

మోహిని ఇంట్లో మూలమూలలూ వెతికి విదేశీవస్తువులు పోగుచేస్తున్నది. వకీలు అకస్మాత్తుగా ఇంట్లోకి వచ్చినాడు! వచ్చి అదంతాచూచి ఉలిక్కిపడి "ఏమిటి చేస్తున్నావు" అని భార్య నడిగినాడు.

"ఏమిలేదు, విదేశీవస్తువు లన్నింటికీ స్వస్తి చెపుతున్నాను; ఇల్లువాడే టప్పటికి మనయింట్లో పరదేశపువస్తువు ఒక్కటీవుండకూడదు" అని భార్య చెప్పింది.

వకీలుతల గిర్రున తిరిగింది. నక్షత్రాలు ఒక్కొక్కటే కళ్ళముందరిగా వెళ్ళిపో తున్నట్టు అయింది. ఆయన మోహినితో "సిగ్గు కాపాడుకోటానికైనా బట్టఉండనీ" అన్నాడు.

"ఇప్పుడు మన దేశంలో సిగ్గుకూడానా? విదేశీ వస్త్రాలుకొని సిగ్గువదిలే దానికి ఇంకా రక్షణ యెందుకు? సీతాసావిత్ర్యాదుల మానము కాపాడిన దేశీయువల్కలాలను దయాస్వరూపిణి అయిన ప్రకృతి మన కివ్వదా? బట్టలుకోసం భారతఖండం చింతిస్తుందా? ద్రౌపదికి అనంత వస్త్రాలి యిచ్చిన భగవంతుడు మనకు వస్త్రాలు లేకుండా చేస్తాడా?"

ఈమాటలంటూ ఆవిడ వంటిమీదవున్న చీర తీసి కిందపెట్టి దుబ్బులో పడవెయ్యబోతూ ఉంటే భర్త అడ్డమువచ్చి "అమ్మా, అది విదేశీది కాదు, స్వదేశీ బనారసు చీర" అన్నాడు.

"కాని విదేశీదుర్గంధం వస్తున్నది దాంట్లో నుంచి"

"ఏం దుర్గంధం?"

"వాసన చూడండి"

ఆయన చీర వాసనచూచినాడు. లెవెండరు పరిమళము ఘుమఘుమలాడింది. ఆయనఏమీ మాట్లాడలేదు.

విదేశీబట్టలన్ని ఆంగణములో పోగుచేసి మోహిని కొరివి అంటించబోతున్నది. బయటి నుంచి బిచ్చగత్తె యీలా ప్రార్థించింది. "అమ్మా! రెండుమూడుబట్టలు ఇందులోనుంచి నాకు దయచెయ్యండి, తగులబెట్టకండి. మీ పేరు చెప్పుకుంటూ శీతాకాలంలో నేను, నాపిల్లలూ వెచ్చగా కప్పుకుంటాం అమ్మా!"

దాని మాటలు లెక్కచెయ్యక మోహిని "ఈవిదేశీవస్త్రాలలో ఒక్కొక్కపోగు వేల

కొద్దీ సూదులై నీశరీరాన్ని గుచ్చుకుంటవి" అని చెప్పింది.

భిక్షుకురాలు అంతటితో ఊరుకోక మళ్లీ "దీనురాలను, బికారిని! అమ్మా, కట్టుకోటానికి ఒక్క బట్టయినా లేదు. ఒక్కటైనా ఇవ్వాలమ్మా!" అని వేడుకున్నది.

"మనదేశంలో జనమంతా వస్త్రవిహీనంగానే ఉంది. అంతా దరిద్రులే సుఖంగా వున్నదెవరు? పో, వెళ్లిపో, మనదేశానికి స్వరాజ్యం వచ్చేవరకూ శీతకాలం ఏలాగో గడుపు. పో" అని మోహిని చెప్పింది.

అగ్ని తగలగానే విదేశీవస్త్రాల పోగు భస్మమవుతున్నది. ఆనందముతో చేతులు తట్టుతూ గంతులు వేస్తున్న చిన్న వేశవులు అగ్నికాంతిలో మోహినికి కనుపించినాడు.




# డా॥ గురుమూర్తులు

సాహిత్యసరస్వతి సీకిపి ఆంజనేయులు గారు

గమనవేగభరమ్మునఁ గ్రాఁగి, మిత్ర!
బహుళదుర్గమాధ్వాన సంభ్రమసమ
తాంతరంగుఁడ వగుచు, దినాంతసమయ [స్వ
ము నరుణకాంతు లాననమునఁ జెంగ
పరిధుఁ బసిఁడిపసుపులు చాఁపినట్లు
కదిసి తరగల మిసుఁగుఱుల్ చెదరినట్లు
వలితెరల జాళువావన్నె యలఁదినట్లు
ముదిరమోమునఁ గెంపులు వాదిగినట్లు
తోఁచి శ్రోఁతనిబాడపుఁ దోఁచునుండి
సౌమ్యసంపన్నమైన కెంజాయ దనరు
పశ్చిమాశాంతరాంబరపటలిఁ జొచ్చి,
నవ్యతేజంబు నందు లీనం బొనర్చి,
కడఁగి పెన్నాఁడు చెలికిఁ గన్పడని మాడ్కి
నాఁగి, మబ్బుల నందందు డాఁగిడాఁగి,
యెడనెడను నీవు పొడమి పర్విడుచు నుండఁ
గాంచి, పూర్వాద్రి ధవళమేఘముల నడుమఁ
జనుచు, నల్లన నెందొ డాఁకొనుచు, వగలఁ
గనుచుఁ, జలివెలుంగుల నెల్లకడలఁ జింద
గోరి, పదునాఱుకళలు నిండారఁ బొలిచి,
సుప్రసన్నముఖుండయి సుస్వభావ
గరిమ విలసిల్లి, నెంతయు మురువుహెచ్చఁ,
బరువెసంగఁ, దీవ్రోత్సాహపటిమ వెలయఁ,
బ్రీతి నిన్ను వెన్నంటుజాబిల్లి నెఱిఁగి—
మీరు డాఁగురుమూర్తుల మెలఁగ నిట్లు
నవ్వనవ్వుల నుండి మీకంతు వెలిసి
పలువెలుంగుల మఱియు దిక్కులఁ దలంచి—
ఈవినోదంపుఁ గలిమి హెచ్చించు వేడ్కఁ
దలుచు మీకడ్డవడు జలదములఁ జూచి—
పెరిమఁ గనుమూసి గంతలు వెట్టి సమస్త
నెల్లజగముల—'మిమ్ము'— గ్రీడింపఁ జేసి
యుల్లమున సంతసిల్లెదు తల్లి నెంచి—
చిన్నిబుడుతలు— కవులు హర్షింత్రుగాదె?

గలుగజేయుట దేశదురదృష్టము. లోకమాన్యుడు యథోచిత సహాయవాది యనియును, సహాయవాది యనియును, అసహాయవాది యనియును భేదాభిప్రాయములు వారి శిష్యుల హృదయములందు బయలువెడలి యంతఃకలహములకు గారణంబులైనవి. చింతామణి, కేల్కారు, ముంజి, జయకరుగారు లోకమార్గమును జూపుచున్నారు. అభయంకరు, కరండికరుగారులు వేరొక మార్గమును బోధించుచున్నారు. మరికొందరు మూడవమార్గము నవలంబించుచున్నారు. కర్మయోగారూఢుడైన లోకమాన్యున కీవాద ప్రతివాదములు పరమవిషాదమును గలిగించియుండును. బహునాయకమైన దేశమునందు కార్యాచరణసంకుచితమైనను సిద్ధాంతముల కంతము లేదు. నాయకుల సిద్ధాంతరాద్ధాంతములు ప్రజాహృదయమునందు గలుగజేయుచున్న మహా సంక్షోభము కర్మయోగారూఢుడైన లోకమాన్యునకు మహాసంతాపమును గలుగజేసియుండెడిదని లోకమాన్యుని సాంవత్సరికారాధకులు సంస్మరించుట ధర్మము. కర్మయోగ పరమైన గీతాభాష్యమునందు లోకమాన్యుడు ధర్మానుష్ఠానసాధనములనువిశదముచేసెను. ఆధర్మరహస్యమునే యవసానకాలమునందు లోకమాన్య బాలగంగాధరతిలకు వారి శిష్యప్రశిష్యులకును భారతీయులకును లోకమునకును బ్రకటించి పరమపదమునుబొందెను. ధర్మము చెడి యధర్మము ప్రబలునపుడు ధర్మసంస్థాపనమునకు పరమేశ్వరు డవతరించుచుండును.

ధర్మానుష్ఠానము:

విజయుడు భారత రణరంగమునందు యుద్ధపరాఙ్ముఖుడై యస్త్రవిసర్జనము చేసినపుడు శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు కర్మయోగరహస్యమును బోధించి యర్జునుని యుద్ధాభిముఖుని జేసినవిధమునను వైరాగ్యోపహతులై నిర్లేపత్వమును బూనిన భారతీయులకు లోకమాన్యుడు కర్మయోగప్రాశస్త్యమును బోధించి వారిని స్వరాజ్యాభిముఖులను జేసినవిధమును లోకమాన్యుని జీవిత మనంతముఖములను బోధించుచున్నది. లోకమాన్యుని వలెను ధర్మారాధనమును త్రికరణశుద్ధిగను జేయుటవలననె వారియారాధనము సార్థకను గాగలదు. భారతీయులకు వర్తమానకాలమునందు పరాధీనతను తొలగించి స్వరాజ్యమును స్థాపించుట పరమధర్మమని యన్ని పక్షములవారునునంగీకరించుచున్నారు. స్వరాజ్యసాధనములందు భేదాభిప్రాయములు బయలుదేరుచున్నవి. స్వరాజ్యానుభవము వ్యక్తులకునుజాతులకునుస్వధర్మము. పరరాజ్యానుభవము వ్యక్తులకును, జాతులకును, పరమధర్మము. లోకమాన్యుడు స్వరాజ్యము భారతీయుల జన్మహక్కని నిర్భయముగ దిగంతములందు చాటి స్వధర్మ నిర్వాహణమును జేసి చరితార్థుడయ్యెను. పరధర్మారాధనము వలనను గలిగెడి ప్రయోజనములను తిలకు మహాశయుడు నిరసించి స్వధర్మానుష్ఠానవిధానమును భారతీయులకు వ్యక్తము చేయగలిగెను. భయావహమైన పరధర్మారాధనమును జేయుటకంటెను స్వధర్మానుష్ఠానమునందు

మరణము శ్రేయస్కరమని శ్రీకృష్ణుడు చేసిన ధర్మనిర్ణయమును లోకమాన్యు డారాధించి ధర్మానుష్ఠానవిధానమును లోకమునకు వ్యక్తముచేసెను. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" యను గీతోపదేశము స్వారాజ్యసంరంభమునందు భారతీయులకు స్వధర్మానుష్ఠాన విధానమును విశదముచేయుచున్నది.

అనంతవిభూతులతో నిండియున్న మాతృదేశ సందర్శనము మహానుభావులకు సాధ్యముగాని సామాన్యులకు సాధ్యముగాదు. వందేమాతరం కీర్తనను బంకించంద్రుడు రచింపగలడుగాని సామాన్యులు రచింప జాలరు. ముప్పది మూడుకోట్ల ప్రజలను బ్రహ్మజ్ఞానసంపన్నత్వమును సహజ సంపదలను జూచుటకు దివ్యదృష్టి గావలసియున్నది. ఆ దివ్యదృష్టి గలుగుట కనన్యమైన భక్తియె సాధనమని లోకమాన్యుని జీవితము విశదముచేయుచున్నది.

శ్లో. భక్త్యా త్వనన్యయాశక్యః అహ మేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప!

స్వారాజ్యమును తెలిసికొనుటకును, గనుగొనుటకును అనుభవించుటకును అనన్యమైన స్వధర్మానుష్ఠాన మవసరమని తిలకు మహానుభావుని జీవితము విశదముచేయుచున్నది. కాని సర్వత్ర స్వధర్మానుష్ఠానమునకు బదులు పరధర్మానుష్ఠానము ప్రత్యక్ష మగుచున్నది. విద్యాలయములు, న్యాయస్థానములు, పదవులు, బిరుదములు, ఉద్యోగములు, జీవిత విధానము పరధర్మారాధనమునకు సాధనములుగ నున్నవి. పర ధర్మారాధనము నందు గల వ్యామోహమే హిందూమహమ్మదీయ విభేదములకు బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములకు మితవాద స్వతంత్ర వాద విభేదములకు గారణంబులుగ నున్నవి.

భేదములకుమూలము స్వప్రయోజనము గాని అనన్యమైనధర్మారాధనముగాదు. లోకమాన్యునివంటి దేశభక్తులకు భారత జాతీయ బృందావనమునందు భేదావరణములు దుర్లభము. స్వప్రయోజనపరాయణులకు భేదావరణములు గనుపించుట సహజము. పరధర్మప్రతిష్ఠాపకు లిట్టిభేదములను చిరస్థాయి చేయ గోరుటయును రాజ్యనీతియై యున్నది. రీడింగు బర్కెనుహెడు ప్రభువులు కోరెడి సహకారము పరధర్మారాధనమునకు వినియోగపడునటులు స్వధర్మారాధనమునకు వినియోగపడజాలదు. బర్కెనుహెడు ప్రభు వనవరతము పరధర్మారాధనమును బ్రిటీషుసామ్రాజ్య ప్రయోజనములకు బోధించుచున్నాడు. బర్కెనుహెడు ప్రభువుకోరెడి పరధర్మానుష్ఠానము స్వారాజ్య సంపాదనమునకు ప్రతిబంధకముగ నుండగలవిధమును శాసనసభా వ్యవహారములు విశదముచేసినవి. శాసనసభాప్రవేశముతోనే పరధర్మారాధన మారంభమై ఆరాధన మవిచ్ఛిన్నముగను సాగుచుండును. అధికారపువలయందు జిక్కుకొనిన దేశమునకు మోక్షమార్గము దుర్లభముగ నుండును. ఆంగ్ల పరిపాలకుల [illegible] తెలిసియున్నది. ఉద్యోగముల వ్యామోహ[illegible] [illegible]లను బుట్టించుచు దేశమును సు[illegible]గను

